హిందూస్తాన వ్యవహారములు ౨౦ ఎండ్లకు పూర్వము మోంటేగుగారు చెప్పినటులు దారుతుల్యములును, అయోమయములును, పురాతనములును, ప్రజాయోగక్షేమములకు నిరర్థకములుగను నున్నవి. హిందూస్తానము నానాజాతిసమితినుండి వీడిపోవుటకు తీర్మానములు చేసినను నిరర్థకములు. రాజ్యాంగ సంస్కరణముల వ్యాజమునను జరుగుచున్న ప్రహసనము పరమవిషాదమును గలుగజేయుచున్నది. కౌన్సిలు ఆర్డరులు శరపరంపరలుగను బయలు దేరుచున్నవి. బ్రిటీషుపరిశ్రమలకును, వ్యాపారమునకును, ఉద్యోగులకును రక్షణోపాయములు ప్రవర్థమానమగుచున్నవి. అధికారులకు రాజ్యాంగ పాశబంధములను బిగదీయుట కనంతావకాశములు గలుగుచున్నవి. ప్రభుత్వాధికారులీయవకాశములను ప్రజాహృదయములందు కలవరమును గలుగజేయుటకు వినియోగించుచున్నారు. వివిధసంఘములందును, పక్షములందును. మహాసంచలనము బయలుదేరినది.



...కేర్పడిన కాంగ్రెసుపక్షము ప్రజాపోషణమును బడయుచున్నవిధమును కాంగ్రెసువిజయములు వెల్లడిచేయుచున్నవి. కాంగ్రెసునందును జాతీయపక్షము, సాంఘిక పక్షము, పార్లమెంటరీపక్షము, మంత్రినిరాకరణపక్షము మొదలగుపక్షము - లుండుట చేతను కాంగ్రెసునందును భేధాభిప్రాయము లేర్పడినవనువదంతి ప్రబలినది. కాని వార్ధాయందు గతవారమునందు సమావేశమైన కార్యనిర్వాహకసంఘ వ్యవహారములు భేదాభిప్రాయముల కవకాశములు లేవని విశదము చేసినవి.

గాంధిమహాత్ముని యుపదేశము లెల్లప్పుడును శాంతిసంయోగములకు వినియోగపడుట సహజము. ముప్పదియారు కోట్ల ప్రజలును, విశాలమైన దేశమును, వివిధమతసంఘములును గల దేశమునందు భేదాభిప్రాయము లుండుట సహజము. ఆ భేదములను దేశక్షేమమునకును, శత్రుభేదమునకును వినియోగించుట ; ధర్మము కాని

[illegible]

దును దేశస్వాతంత్ర్యమునకును, ప్రజాక్షేమమునకును పాటుపడినవిధము చరిత్రాంశము గాంధిమహాత్ముని నాయకత్వము ప్రజలయందుగలుగజేసిన ప్రబోధవిశ్వాసములు సకలజనులకును స్వధర్మానుష్ఠానమునకు ప్రమాణములుగనున్నవి. శాసనసభలయందు సభ్యులగుటకు 3000 మందికి మాత్రమె యవకాశములుగలవు. శేషించిన 3౽ కోట్లమందియును కాంగ్రెసుప్రచారము, ఖద్దరుప్రచారము, హిందీప్రచారము, గ్రామపరిశ్రమోద్యమము మొదలగు నిర్మాణోద్యమములందు పనిచేయుటకపకాశము లనంతములుగలవు. ప్రారంభమునందువలెను వర్తమాన సమయ

[illegible]హాత్మ[illegible] ప్ర[illegible]ంచిన అనావ్య[illegible]

హిందూస్థానమునకే కాకను ప్రపంచమునకంతకును మోక్షసాధనము గాగలదు. దేశక్షేమమునకై ఎవరేమి చేసినను నది దేశకైంకర్యమునకై వినియోగపడుచున్నది. భేదములు శ్రద్ధయందును, దేశకాలపాత్రములందును గలదు గాని పనియందు లేదు. అన్ని పక్షములవారును భేదాభిప్రాయములను విడిచి దేశమోక్షమునకై కాంగ్రెసుద్వారా పని చేయుటకు చేయుచున్న ప్రయత్నములు భగవదనుగ్రహమునను ఫలప్రదము లగుగాత! ఆంధ్రదేశమునందును ప్రజానాయకులకు పూర్వమువలెనే కాంగ్రెసుపట్లను భక్తిశ్రద్ధలు ప్రబలి కాంగ్రెసున కఖండవిజయము గలుగుగాత!

---

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor: G. Subbaramayya.



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M140 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | YES |
| మొత్తం పేజీలు | 149 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 98,103, |
| లేని పేజీలు | 125-130 |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | munisha |
| స్కాన్ చేసినది | Sravksha |
| పరీక్ష చేసినది | haseema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |